# అ ను క్ర మ ణి క


| విషయము | పుట |
|---|---|
| కోయిల పాటలు | ౯ |
| కలంకిని | ౨౧ |
| ఉడుప్పపాట | ౨౨ |
| గోదావరి | ౩౮ |
| నెలబాల | ౪౮ |
| బాలగీతి | ౫౦ |
| అహల్య | ౫౨ |
| కోయిలా ! | ౫౫ |
| గీతిక | ౫౭ |
| మాతృపూజ | ౫౯ |
| హంసలు నెమళ్లు— | ౬౨ |
| శాంతి | ౬౯ |
| శాంతి | ౭౩ |
| నీతువు | ౭౯ |
| పాలిపాట | ౮౨ |
| స్వేచ్ఛాగానము | ౯౨ |
| మహాత్మా ! | ౯౪ |
| శిల్పి | ౯౫ |
| ప్రజాగీతం | ౯౬ |

తొఁగరు జిగి తేరు నును మావి యిగురు కొఁసలు
కెరలి కుత్తుకబంటిగా కొఁరికి తినుచు
తద్దయును రేగు కమ్రగీతా సుధలను
కో యనుచు పాడు కోయిలకొఁలము నాది.

నా కులస్వామి నిఖిలరసైకభూమి
దివ్యయౌవన మాంగల్య దీపరేఖ
కువలయానంద జీవనోత్సవ విధాయి
శ్రీవసంతుండు ఋతురాజశేఖరుండు.

నా నెలవు నిత్యవికచప్రసూన మధుప
గాన ముఖరిత మోహనోద్యానసీమ.

నా యనంతచైత్రమున నే నాఁడు సుభగ
తరళ సురభిళ వాతపోతములె కాని
పుడమి వడఁకించు చలిగాడ్పు సుడియఁబోదు.

లేవు నా నీలనభమున లేశమేని
లోకమును బిట్టు ముంచి చీకాకుపఱచు
నిబిడనీరంధ్రధూమ్రములనీరదములు.

నవనవోజ్జ్వలాయతములౌ నా యుషోంగ
ణముల నలమదు మలినమౌ తిమిర రేఖ.

నా నవారుణ వారుణీ శోణ నేత్ర
కోణముల నశ్రుకణములు కూడ వెపుడు.

గద్గదిక లేదు నా ముక్తగళమునందు.
కలదు నా వికస్వర కలగానమందు
జగతి నుడికించు వైద్యుతజ్వాల యొండు.

భువియె నందనవనముగా బుగులుకొనగ
మానవుడె దివ్యజీవిగా మసలుకొనగ
బ్రతుకె రసపూరపటుగానబంధురముగ
పాటయే జీవనపు తేనె యూట గాగ
భావ మూదులే నా జాతి పాట తెరగు;
బ్రతుకు మీటులే నా జానుపాట హొరగు.

# కోయిల పాటలు

వాడువాఱిన నాదు జీవనపు వల్లి
మరల నివు రొత్తి నవ్యసుమాప్తి నడరె;
నే సుముఖి ప్రేమమయ దృగ్విలాసకలన
నట్టి మన్మనోమోహిని నాశ్రయింతు.

తలతు నెప్పుడు నా ప్రాణధనము! నీదు
పరమపావన రూపవిభ్రమము లెదను;
పాడెదను సుంత నేడు నీ ప్రణయ మహిమ;
ఎవ్వరేమనుకొన్న నా కేమి లోటు?

చాగురే! మొన్న నేకా విషాదగీతి
పలికినాడను విషవహ్ని పజ్జనుండి!
ఇంతలోనె యీదీనుపై నెంత కరుణో?
సరస శృంగార గీతాళి సంతరింతు.

కార్తీక శు. కాలయుక్తి.

౧

మావి చివురించె; నల్లన మాసె మంచు;
మాలతీ వకుళంబులు మధువు లొలుకు;
కొల్లగా తావు లందించు పిల్లగాలి;
వెన్నెలలు వెన్నలను బెట్టు కన్నియలకు;
పొలిచె మహి యెల్ల స్వర్గాతిమోహనముగ.
ఇట్టి సుమధుర మధురాత్రి నెట్టి హతుడు
ప్రాణపదమగు ప్రియురాలి బాయనేర్చు?
'కోయిలా! పొమ్ము, నీ కవ డాయు మిపుడె;
మేలి చవు లొల్క లీలల దేలు మిపుడె.
తరుణిమం బేగు నీ వసంతంబుతోన;
అరుగు క్షణ మెల్ల మృత్యువుదరికె.' యనుచు
అవలి వేణుకుంజమునుండి యాలపించు
శ్రావ్యగీతిక నవ్యక్తసరణి నెవరొ!

*　　*

ఆలసించిన పాపమా, నటుల గాన
ప్రాజ్యమగు నా వసంతసామ్రాజ్యమునకు
నిన్నె పట్టపు దేవిగా నెన్నుకొంటి;
రమ్ము ప్రాణమా! కౌగిలి యిమ్ము వేగ.

సుచిర గాథ పరిసుప్తిలో సొక్కి సొక్కి
యల్లనను మేలుకాంచి యయ్యారె! చూడ
నెట్టి సురుచిర సౌధంబు కట్టికొంటి!
—పరివిమలానందరసవీచి భాగ్యరాశి
వసుమతీదేవి పావన వక్షసీమ,
సరస శాద్వల మసృణ విశాలతలము,
మధుర ఫలపుష్ప మంజరీ మధ్యభూమి,
అమృతవాహిని యంచితాభ్యంచలంబు,
నీలనభము, మణీరుచుల్ — మేలు మేలు!
ఊరకే కాదు సకియ! ఈ చారురచన.
రమ్ము, ఈగృహలక్ష్మివి కమ్ము వేగ.
వేచియున్నది విశ్వ మీ వేళకొఱకె:
నేడు మొదలుగా క్రిమ్మఱి నాడుకొంద
మాది తుదిలేని మనల సయ్యాట లెలమి!

నీవు నామది బాసిన నిఖిలజగము
జడము, శూన్యంబు, నస్థిసంచయము నగును;
నీవు తలపున బారిన నిముసమందె
ఒక నవాలోక దివ్యచంద్రిక హసించి
ఒక వికస్వర చైతన్య మొలసి యాడి
ఒక రసోజ్జ్వల శీధువోడికలు గట్టి
ఒక మహానందవాయువీచికలు రేగి
స్వర్గమో యేమొయై ధాత్రి సకియ! ఇంద్ర
జాలమట్టుల నన్ను నిస్తబ్ధు జేయు.

పుడమి యెల్లను మంటిలో నడగుగాక,
గ్రహము లెల్లను వినువీధిఁ గాలుగాక,
భూతములు విలీనంబులై పోవుగాక,
చెలియ! మన యాట కేపాటి చేటు లేదు.
కలగి వారాశు లేకమౌ ప్రళయవేళ
నిర్భరము తమ్మి తేకుపై నెల్లమమత
చేయిచేయిని జేరిచి హాయి మీఱ
నోడ లెఱుంగక నిదురింత మొక్కరముగ.
కాలమును దిక్కు లేని యా కాలరాత్రి
ఘోరముగ పిడుగు లురుముచు జారు తఱిని
కారు మబ్బుల కవ్వల కాంత! మనము
మెఱయుదము తోచితోచని మెఱుపువోలె.
కడలి చల్లారి గ్రహములు గతులు దక్కి
సద్దు నిద్దుర చెందు నిశ్శబ్దమందు
ఎల్లరాగవల్లరులకు నెల్లయైన
శూన్యరాగాంబుధిని జేరి సొక్కుదముగ.
మరల నాబ్రహ్మ మానస సరసినుండి
జగము లుదయించు ప్రాభాత సమయమందు

విశ్వమెల్లెడ, లోనను వెలిని గూడ,
మొగ్గగా నేను అందలి మోజు నీవు,
పూవుగా నీవు అందలి తావి నేను,
నింగిగా నేను అందలి నీల మావు,
తారగా నీవు అందలి తళుకు నేను,
ఇట్టు ఎడలేని పెనకువ నెలసి సొలసి
యాడుదముగాదె కడలేని యాటతేట !

శ్రీశుడే నాదు సత్తపఃప్రీతు డగుచు
వరము లీయంగ కరుణించి వచ్చెనేని,
అడుగ సుఖదుఃఖముల కెల్ల నవ్వలిదయి
వెలుగు చీకటులకు జూడ వెలిది యగుచు
లోకమే లేని నిర్భరాలోకమందు
కలనో లేనో యెఱుంగని కలిమి చెలిమి
వఱలు నిరవద్య నిత్య నిర్వాణ లక్ష్మి.
కోర కమనీయ కాంతుల తోరగిల్లు
నాకలోకమునందు నందనము నడుమ
కుందనపు తమ్మిపూవుల కొలని కెలన
మంజు మందార రంజన్నికుంజములను
నిత్య శారద పూర్ణిమా నిశలయందు
అప్సరోగీత సుధలచే హాయి గరగి
మధుర మధుపానమున మయి మఱచి, సతము
నందగల రుచిర పక్వ బింబాధరంపు
లలిత రంభానుభోగ సంరంభ తతుల;
వేడికొందును ప్రేయసీ! వేయి గతుల
తత్పదాంభోజముల బడి దయ చిగుర్ప

మెఱుపుతీగకు మెఱుగులు మెలపజాలి
నవ్య నవనీతముల మించు నవక మొలసి
అమృత లేపంపు చలువల నవఘళించి
స్వర్గ శతముల యుగసహస్రముల సుఖము
కొల్లగా నొక్క క్షణమంద కూర్చు నీదు
ప్రణయరస పూర్ణకుంభ సౌభాగ్య భోగ్య
భూరి విస్తర సుస్తనాభోగ భార
సంచలత్తను తనులతా సంగ పూజ్య
రాజ్యరమ కెల్ల నన్ను సామ్రాట్టుగాగ
కూర్పకున్నను పోనిమ్ము, కొసరి కడకు
కెంపులకు కెంపుసొంపుల పెంపు నీదు
కెంజిగురుపుంజములు వోని మంజులంపు
శ్రీ చరణ కంజయుగ్మ సంస్మృతియు నేని.

ఇలు విడచి, పూవు ప్రియంపు టెంతిమీద
బంధురంబుగ నల్లిన ప్రణయ మధుర
కోమల లతా వితానముల్ కోసివైచి,
అడవులను బట్టి, కావుల జడల గట్టి,
తమ మనములట్ల శూన్యతమములు నంధ
తమములై బెగడు గొల్పెడు దరులు జొచ్చి,
కాయ మెండించి, యింద్రియగ్రామ మేర్చి,
ఆత్మమథనమునందు ఘోరాబ్దములను
గడపియును మాను లేద్దాని గాంచలేరో!
అట్టి యవ్యయ రుచిర దివ్యామృతంబు
లలిత తాంబూల రాగానురంజితంబు,
క్రమ కర్పూర సౌరభ గర్భితంబు,
మంద మందాక్ష సుస్మేర సుందరంబు,
మంజు కిసలయ శోభా విమానసంబు,
మన్మనోమోహనాతిక్షణంబునైన
నీదు మధురాధరంబున నిండువారి
చిన్ని పూదేనెయట్లు నాపున్నెమునను
చింది చిప్పిలు; నెచ్చెలీ! చేరి యొక్క-
సిద్దపుం గూర్మి మెసలారు ముద్దొసంగి
శాంతివఱుపు నా యతిలోక సాంద్ర తృష్ణ.

సకియ! నీపయి నెసగు నాస్వచ్ఛరాగ
మాత్మశుకి పంజరమునుండి యవల బార
దిక్కులను గాంచి రెప రెప ఱెక్క లార్చి
తహతహను జెందు నాశుభతరుణమందు
ద్వారమును దీసి తొలిమాఁదు దారి చూపె
కనను వినరాని వింతలోకముల కెల్ల.
పుట్టు పూర్వమునుండి నన్ జుట్టియున్న
బహుళ దుర్గంధ కర్దమ పటలినుండి
లేవగా దీసి తీర్థంబు లీల గడిగి
యుదయ కమలమునట్లు లింపొదవజేసె.
గడన చేసిన భూషణోత్కరము నెల్ల
చిత్రముగ నూడ్చి నను నగ్నచిత్తు జేసి
క్రమ్మఱను తల్లి యొడిలోని కందువట్లు
సహజ సౌందర్య రేఖా ప్రసన్ను జేసె.

చెలియ! నాపయి జిల్కు నీ స్నిగ్ధరాగ
మమల శారద జ్యోత్స్నా రసాంబు సరణి
మందముగ నాదు నామ్లానమనము దడిపి

మధుర పీయూషధారల పొదలజేయు.
కొలది మెఱుగని తీయని కూర్మి గారు
నీదు బిగితంపు కౌగిట నిఖిలజగము
కరము నాయార్ద్ర వక్షము కంట గదియ
గగన భూవిస్తరములతో గలయ గాంతు.
శ్యామ! నీముగ్ధ మధుర సంసర్గ కలిత
లలిత సమ్మోహావశత నల్ల నను గరగి
హృద్యతర గంధబంధుర పృథ్వి దొరగి,
ప్రచల కల్లోల ప్రాణతీరంబు విడచి,
భూరి కాంతిమయ స్వప్నభూమి గడచి,
ఆత్మరాజ్యంబునకుగూడ నవల దాటి,
శాంతి గంభీర నిర్వృతిసదన మేమొ
చేరుకొనువాడ, ధన్యత చెందువాడ.

# కలంకిని

తాళజాలను నాథ! ఈ తాపభరము;
గ్రీష్మ దావాగ్నికన్నను భీష్మ మయ్యె;
క్షణము క్షణముగ హృదయంబు గాల్చుచుండె;
ఉస్సురులు హెచ్చి ప్రాణంబు లుడుకుచుండె....
ఈడుజోడులతో గూడి యాడు చెలులు
ఏమది యటంచు నడుగుదు రే మనందు?
'పాపిని యటంచు ప్రియుడు నన్ బాసిపోయె;
కోపమును జెంది విరహాగ్ని గూల్చి చనియె.'
అనుచు నేమోము పెట్టుక యాడుదాన?
ఆడుదాన నెటుల లజ్జ వీడుదాన?...
తొల్లి కడు నింపు నింపు నీ నల్లమలలు
నింగితో గూడ నా యంతరంగ మట్టె
నిర్దయంబుగ జీల్చెను; నేడు వనులు
తొంటి శాంతిని పిడుకక మంట గొలుపు.
ఎన్ని బాముల యెగ్గులో యెల్ల లేచి
పాములట్టుల నా మది బ్రాకి కలచు.

తరుణ పల్లవాగ్రంబుల దరికి బిలుచు
వనలతలు నేడు పెడమోమువరున జూపు;
చిరసఖులు కీరశారికల్ చేరి కేరి
పలుకరింపవు; భ్రమరముల్ పాడబోవు;
అనునిమిష చిత్రరోచుల నామెత లిడు
సంధ్యయును నేడు మిగుల భీషణత దాల్చు;
జగము వెలిగింప చనుదెంచి చందమామ
నన్ను చూచియె కాబోలు మిన్నుబాసె;
చుక్కలైన నొక్కింతాశ చూపకుండ
మబ్బులెల్లను క్రూరత మాటుచేసె;
ప్రకృతి యంతయు నామీద పగను బూనె;
అంధకారము కడలెల్ల నావరించి
లోని చీకటి పెంచు; నయ్యో! నితాంత
నరక మయ్యెడు— మరణమా! శరణు! శరణు!

కాళయుక్తి, కార్తీక శు.

# ఊడ్పు పాట

"ఏ ఊరు ? తెరువరీ ! ఏసీమ నీది ?"
"పల్నాటిసీమలో పాలెము మాది."
"ఏపని పిలువంగ ఏడబోయెదవు?"
"నీవంటి పడుచును నెమకి పెండ్లాడ
అడవి కావలి సీమ వెడలుచున్నాడ."
అను పలుకు విన్నంత ఆకులుకులాడి
పగడంపు పెదవి చిర్నగవులే చిలుక
తళుకు చూపుల కొత్త బెళుకులే తొలుక
నెలవంక నెమ్మోము నిండ వికసింప
పలికె నిట్టుల పిఱికలికిపలుకులను.
"ముల్లోకములు నీవు ముట్ట వెదకినను
వగకాడ నాసరి సొగసరి యరిది.
మనసు నీపై తగిలి మరలకున్నదిర.
వత్తు నీతోడ, చేపట్టి గొంపోర."
చెలికార మొలుకు నా వలకారి పలుకు
చెవులకు నమృతమై చవులూరజేసె.

విరిబోణి మృదుపాణి కరము సోకంగ
మనసు హాయిని మున్ని మఱచె సర్వమ్ము.
తమితోడ తమకంబు తద్దయు రేగ
కులుకు గుబ్బెత కిట్లు కోడెకా డనియె.
"వెలగపం డాసించి వెదుకంగబోవ
పనస చేపడియె నా భాగ్య మేమందు?
నాపుట్టు మేలయ్యె నా నోముపంట!
నామల్లెపూదండ! నా మావిగున్న!
నా చక్కెరల కుప్ప! నా చందమామ!
రావె బంగరుబొమ్మ! రా ముద్దుగుమ్మ!
రాగదవె నను గూడి భోగింతు గాని.
బందరద్దకము లో బాల! తెచ్చెదను.
చంద్రగిరి రైక లో చాన! యిచ్చెదను.
ముద్దినుసు గాజు లో ముగుద! తొడిగెదను.
రకరకము పూవు లో రమణి! ముడిచెదను.
ఎపుడు నామని పుల్కరించేటి కడల,
పచ్చపచ్చిక పట్టు పఱపుల మెడల,
పండువెన్నెల రేల, పగటిప్రొద్దులను,
ఆ గువ్వదంపతులట్లు లో సకియ!

ఎలమి గుల్కు సుఖింత మెడ లేక యెపుడు."
అని సంబరము మీఱ నావయసుకాడు
అ యంచనడల యొయ్యారిని గూడి
పుట్టలు గడచియు గట్టు లెక్కియును
కడిది నూదుల ముండ్లకంచెలు దాటి
పొనపొన బారెడు సొనలు తరించి
నేలకు వంగిన నేరేడు చాళ్ళు
గుబురుగా పెరిగిన గుజ్జుమామిళ్లు
అబ్రంపు కపురంపు అరటిబోదెలును
సొంపుగా చూపట్టు సురపొన్న చెట్లు
నిండార విరిసిన కొండమల్లెలును
పండి గుమగుమలాడు పనసబోదలును
తోరంపు గుదు లూగు నారింజతరులు
దోరకాయలు వేలు దొడ్డ రేగులును
పసిమించు పండు లింపెసగు పాలలును
పలక బారిన మేలిపండ్ల జాములును
కొమరుగా పండిన కమలాల గుములు
కమియబండిన తీయ తుమికిబారులును
ఆరముగ్గియు తేనె లూరు వెల్గలును

బూరలూదెడు గొప్ప బొంగు వెదుళ్లు
తఱుచైన నల్లని తాటిమ్రానులును
తళుకు బంగరు పూల తంగేటి చెట్లు
ఎలతావి నునుపూల నలరు దిరిసెనలు
తెలిసిలిజిగిపూలు వెలయు కానుగలు
జడితేనియలు కారు కడిమి గున్నలును
వెడతేనె లూరు క్రొవ్విరుల యిప్పలును
పొడగారు గెలలూగు బెడగు జీలుగులు
గొనబారు కొన లూగుకొనెడు వేణువులు
ఇగురు జొంపాల నింపగు నశోకములు
బుగులు వాసనల సంపెగల తంపరలు
పగడాల పువ్వుల నగెడు గన్నెరులు
రతనాల గింజలు రాలు దానిమలు
పరువంపు గుత్తుల గురివెంద పొదలు
విరియ బూచిన మేలి విరజాజి లతలు
వెలివెల్లులను గ్రిక్కు వెలుగు తీగలును
చెలువు గుత్తుల ద్రాక్ష చలువ పందిళ్ళు
వాలాయము నటించు నేలాలతికలు
అల్లిబిల్లిగ నల్లు అడవి మల్లియలు

ఈలల కెగబ్రాకు పాలతీగలును
పాలలపై వ్రాలు పూల బదనికలు
కొదమ పూరేడులు పొదలు పొదరిండ్లు
తప్ప త్రాగిన తేటు లొప్పు రుప్పలును
సీతజడలు, 'చుప్పనాతి' సవరములు
అవిసెలు, ఆదొండ, లల్లొనే రేళ్ళు
ఆడుచు పాడుచు నలవోకతోడ
కూడిమాడుచు కేల కొమ్మ లందుచును
కోయుచు జెవురుచు గోర గిల్లుచును
చవులూర నిచ్చుచు చనవులు గొనుచు
కికురించి డాగి కేకిసలు కొట్టుచును
ముద్దులాడుచు మఱి సుద్దులూకొనుచు
మోహంపు వెల్లిక మునిగి తేలుచును
నడచుచు నాగుచు కడగి సాగుచును
గడచుచు నొక కొంతవడి యేగు దేర
నకనకలాడి యా ననబోడి చాల
అసుఱుసురులు వోయి యసియాడి యనియె...
"అంచును దరిలేని యడవి నడకల
ముండ్లచే రాళ్లచే మ్రోడులచేత

అకట! నా మెత్తని యడుగుదామరలు
కంది వాచియు నెత్తురిగండ్లయి యెటుల
నొగిలెనో చూడు నా నెగులోయి సకుడ!
అదె యిదె నీ యునికి యను బరవసాన
ఎట్టులో యింతవ ట్టిగుదెంచితిని.
ఇక నొక్క యడుగైన నిడజాల నేను.''
అని కొమ్మనీడ నల్లన సూలబడియె.
కటకటబడు తన కాంతను గాంచి
జాలిచెందిన మది చాలంగ వగచి
"చెలువ! నొచ్చితె?'' యంచు చేరగాదీసి
తన యంసతలమున తరుణుండు మమత
కొమరుగా కొమరాలి గూర్చుండజేసి
మట్టులు మారేళ్ళు మంచిగందములు
ఏపులు నక్కెరల్ వేప లందుగులు
చింతలు మేడులు జీడి బాడిదలు
మోదుగు లూడుగుల్ ముషిణి బూరుగులు
చండ్రలు తేకులు జమ్మి గుమ్మడులు
ఒద్దులు లొద్దుగుల్ మద్ది దుద్దుగులు
కొడిసెలు వేగిసల్ కొరివిపాలలును

తినిశలు గుగ్గులుల్ దేవదారువులు
అంకుడు కుంకుడు లగరు తొగరులు
విరుగుడుచేవలు పురుగుడు పొదలు
చిల్లలు వాకలు చెముడు రక్కిసలు
గొలుగులు గచ్చలు బలుసు లుస్తులును
పేరులే లేనట్టి పెక్కు డొంకలును
తెగనల్లుకొన్నట్టి తీగజొంపములు
పగ లెఱుంగనియట్టి పచ్చికపట్లు
కాకియు గనరాని కారడవులును
చీమయు జొరరాని చిట్టడవులును
పులి బొబ్బలకు నొడల్ జలదరించుచును
గొదగొన్న కరులకు నదరి బెదరుచును
ఎదురైన యెలుగుల కుదరి పదరుచును
కొండచిల్వల జూచి గుండె జారుచును
కేకి కేకలకు చీకాకు చెందుచును
కోతిమూకలకు లో భీతి నొందుచును
గరిక మేసెడు లేడి కదుపులు గనుచు
పొగలు గ్రక్కెడు త్రాచు బుస్సలు వినుచు
పలువన్నెపిట్టల పాట లూఁకొనుచు

అబ్బుర మందుచు తబ్బిబ్బు లగుచు
వెనుకించి యొకపుంత గని కొంత యేగి
"చేచాయ చూడుమా, చెలువ! యా కోన
నలుపు కాంతుల చూడ్కి నలరింప జేయు.
స్వర్గ మింతటికన్న చక్కన గాదు.
అదియె నా నెలవయి యలరారుచుండు."
అని నాలు గడుగులు చనిన యా చాన
"తలపూవు వాడె, వొదల బిట్టు మాడె;
భగభగమని మండు భానుండు మింట.
మిసమిస నెమ్మోము వసివాళ్లు వాడె.
కరము దప్పిక నోరు వరువట్లు వట్టె.
ఆర్చుచున్నవి ప్రేవు లావురు మనుచు.
కాకలబెట్టె న న్నాకలి చిచ్చు.
ఈ చెర్వు కట్టపై ఈ మఱ్ఱిక్రింద
కూడు వండుక తిని కొంచెము తాళి
మెల్ల మెల్లన మన యిల్లు చేరుదము."
అను పల్కులకు 'నట్టె' యని యాదరమున
"ఇందాక వచ్చు మా మందలో చెలియ!
ఈ నీడ చల్ది మే మెప్డు గుడిచెదము.

మున్ను మా ముత్తాత పున్నెమ్ము నెంచి
ఈ కొలను త్రవ్వినా డిందలి నీరు
కొబ్బెర జలముల గోటికి గొనదు."
అని యగ్గలిక నాడు చా యెమ్మెకాడు
వెలది నా వేయియూడల మఱ్ఱి జేర్చి
సంచిని విప్పి సజ్జలపిండి పప్పు
బియ్యము నుప్పును తొయ్యలి కిచ్చి
మూడు రాళ్ళను దెచ్చి పొయి యొండు గూర్చి
అట్టిట్టు చని నాల్గు కట్టెలు తెచ్చి
చేలకొంగున నున్న చెకుముకి రాల్చి
నిప్పు రగులజేసి నెలత కిట్లనియె.
"సకియరో! నడలచే చాల డస్సితిని.
ఈ నీడ చలువయు ఈ నీటిగాలి
ఎదకు నింపొదవించి నిదుర గూర్చెడిని.
ఇంతిరో! నేద రవ్వంత తీరెదను.
పిలువుమా వంటైన పిదప తడయకను."
అని పొంత నేలపై తన పంచె పరచి
ఒక కేలు గుండెపై, నొండు దిండుగను
అమరించి కనుమూసి హాయి చిప్పిలెడు

జిలిబిలి నయగారి పులుగు పల్కులను
ఎలదేటి బయకారి జిలుగు పాటలను
వలగొన్న హొయలాడి వలపు మాటలను
జుబ్బనచూఱగా జుట్టలు కొనుచు
తన భాగ్యమునకు నెంతయు నుబ్బ గనుచు
కాంక్షలు కమ్మ బంగరుపూలు పూయ
అల్లనల్లన మత్తుజల్లున మునిగె.
గడియైన నిదురలో గడచెనో లేదో
సు ప్తి యాతని కెట్టి సుకము జేరిచెనో
చిరునవ్వు పెదవుల చెంగలింపంగ
ఒక ప్రక్క కొదిగి ముద్దొత్తంగ బోయి
ఎట్టి బీభత్సమ్ము నింతలో గనెనొ
బెదరి బెగ్గిలి గుండె చెదరి పల్లటిలి
త త్తరమ్మున నెంతొ తల్లడపడుచు
అ-అ-అ-అ- యంచును అంగ లార్చుచును
తన్నుకొనుచునుండె తద్దయు కలత.
ఇ త్తెఱంగును గన్న బి త్తరి యేమొ
పట్టజాలని కుల్కు పట్టి యాచికొని
"చెలువుడా ! యిది యేమి సీదర పడెదు ?

కలగుంటువడి బిట్టు కలవరించెదవు ?
చెడుకల యేమొ ని న్నలయించెనోటు?
కను విప్పి న న్నిటు గాంచగదోయి.''
అని యా వెలఁదుగొంటు నడలు పోనడచి
"వంటయ్యె, అన్నము వడ్డించినాను.
తడవేల? యిపుడె సాపడుదము లెమ్మ.''
అన విని యాతండు తన కూర్మి చెలికి
"కలికిరో! యెదొ పీడకల గంటి'' ననుచు
వినుపింప గమకించి వేసరి కొంత
మనసక యించుక జార మఱి యిట్టు లనియె.
'లలనరో ! నన్నొక రాకాసిముండ
——తలచినంతనె అబ్బ! పులకించు మేను——
నూరు కోరల దాక నో రావులించి
మంటలు గ్రక్కుచు మన్నుమి న్నదల
నఱచుచు మ్రింగంగ తఱుముకు వచ్చె.''
అని లేవబోయి క్రిన్నన తల తిరిగి
కన్నులు పచ్చనై, కాళులు తేలి,
గడియలు వడి చెవుల్, కంపించి మేను,
చాపకట్టుగ నేల చదికిల బడియె.

"అబ్బబ్బ! చలి! చలి! అదరించుచుండె.
తలనొప్పి, మొల నొప్పి, తనువెల్ల నొప్పి.
సకియరో! ఈ బాధ సైపంగ లేను.
ఊఁ హుఁ హుఁ! దుప్పటి తెచ్చి యొత్తుగా గప్పు."
అన్నంత చెలి వెల్లనయి బిక్కవోయి
ముదుక దుప్పటి మేను గదియంగ గప్పి
చిత్తేశు నొడలిపై చెయి మోముచేర్చి
'అక్కటా! దైవమా! హా!' యని యూర్చి
జలజల కన్నీళ్ళు జాలుగా గార్చి
"ఇంత వట్టే తెంచి కాంతుండు పడియె.
కానిచో టిది నాకు గతి యెవ్వ రింక ?"
అని బుడిబుడి యేడ్చు నబ్జాక్షి గాంచి
బాల బేలయు కడు గోలగా దలచి
"ఇంతమాత్రమునకా యింతి! బెగ్గిలుట ?
కనుపొట్ట లుబ్బంగ కలగి యేడ్వకుమి.
నడలచే నించుక బడలితి గాని
కానివిధం బొండు కాదుసూ సకియ!
చూడుమా, చిటుకలో సుక ముందు" ననుచు
పాణిగాలు బిగబట్టి పణతి నాదుకొని

అల్లనల్లన పది యడుగులు వైచి
దరి పొదమాటున దళముగా పెరుగు
నొక మూలికను దెచ్చి యువిదకు నిచ్చి
'చెలియరో ! రసము తీసి యొసంగు' మన్న
గల్లుగల్లున చేతిగాజులు మొఱయ
ఒక రాతిబండపై నోషధి నూరి
పైడిగిన్నియలోన వడియంగబోసి
'త్రాగు' మటంచును దయితున కిచ్చె.
ఆ గిన్నె యాదిట్ట డావోద మెసగ
గైకొని నాల్కె వెక్కసముగ జేర్చి
గ్రిక్కుగ్రిక్కున రెండు గ్రుక్కలు త్రాగి
కడుపులో నేదియో కలచిన పైన
వనిత బిల్వగబోయి వాకట్టు కాగ
నారటపడుచుండె; నంతలోపలనె
బళ్ళుబళ్ళున రెండు వాంతులు వెడలి
ఊపిరి సలుపక తాపంబు పడుచు
గ్రుడ్లు తేలగవైచి గుంజాటలాడి
కలక యించుక తేరి కన్నులు విప్ప
తన నెచ్చెలికి మారు కననయ్యె నెదుట

వెఱపు గొల్పెడు నొక్క వికృతంపు రూపు
—కడు గొప్పనగు నొడల్ కందెన చాయ,
గండ్రి వెంట్రుక బీడు గడ్డరిమోము,
జీబురు తలగూడు జిట్ట ముంగురులు,
జేవురు మిడిగుడ్లు, కావురు కండ్లు,
ఊట లూరెడు ముక్కు, చేటల చెవులు,
లొట్టియ మూతియు, మిట్టపన్నులును,
బలు వాలు బొమ్మలు, బానపొట్టయును,
వంకర చేతులు, వాలుడు కాళ్లు,
ఎముక కట్టడపేరు, లినుపగజ్జెలును,
మైల సున్నపుబొట్టు, మసిపాత కట్టు.
అమవస నిసికి మే నమరిన రీతి
కారు మొయిలు నేలబారిన కరణి
పెనుభూత మొక్కటి మును వ్రాలినట్లు
మోన మాకారంబు మోసిన పగిది
రోతబీతులు గొల్పు రూపంబు గాంచి
వెఱగొంది, బ్రమసి, మై గఱుపాటు చెంది
ఝల్లు ఝల్లని గుండె చాల కంపించి
ముచ్చెమటల మేను ముంజెయ ట్లడరి

నిఖిలలావణ్యములు నిశ్శేషములుగ
యువకుడు మూర్తిన్పడియుండెఁ; ఆ జంత,
ఆవింత నాలి దయ్యము, రంతులాడి
వికవిక నవ్వుచు విపరీత గతుల
చిందులు తొక్కుచు చేరి చెల్లాడి
చూపుల కొర్ర్యముల్ కోపులు వేయ
ఎత్తిపోటుల నిట్టు లెకసక్కెమాడె.
"నీలుకాడా! యిదె నీ నోముపంట!
నీ మల్లెపూదండ! నీ మావిగున్న!
నీ చక్కెరలకుప్ప! నీ చందమామ!
నీదు బంగరుబొమ్మ! నీ ముద్దుగుమ్మ
నీదు చెంగట నిల్చి నిన్ను తా వలచి!
ముల్లోకములు నీవు ముట్ట వెదకినను
వగకాడ! నా సరి సొగసరి యరిది
నా వలపుల ప్రోడ! నా వన్నెలాడ!
వత్తు నీతోడ, చేపట్టరా వేగ!
ఉల్లడ గట్టరా ఉల్లాస మలర!
బాసికాల్ గట్టరా ప్రాణవల్లభుడ!
తాళి గట్టర, లేర, తడవు సేయకుర!

మోడి మానుమురా, మోమోడి చూడకురా!
ఎపుడు హోరున ధార లింపారు కడల
ఎంత మ్రోడులు సందడించేటి యెడల
నిండు చీకటిరేల, మండు పొద్దులను
ఆగూబ దంపతు లట్టు లో ప్రియుడ!
హాయి యొల్క రమింత మఱి లేక యెపుడు.
హా! యని పాడుద మలపు లే కెపుడు.''
అని యిహీం! యని నవ్వ చావినపు తిత్తి
పడుచు ననుపుకాండ్రి పాలింటి మిత్తి
యువకుని బుగ్గపై నొక్క ముద్దొత్తి
మటుమాయ మయ్యె నా మాయలసత్తి.

* * *

చెప్పెడి దే మింక? చెనటి చేష్టలకు
పాప! మా ముగ్ధుండు భయ మగ్గలింప
గడగడ వడకుచు కలగి రిచ్చవడి
'హా! మోసపోతినే!' యని లోన వగచి
గుండియ బ్రిద్దలై గోంద్రు గోండ్రనుచు
ఉడుకు నెత్తురు గ్రక్కి యుసురులు విడిచె.

రాక్షస, శ్రావణ.

# గోదావరి

తోగినజాలు నీ విమల
తోయములం దొకమారు భక్తితో,
తాఁగినజాలు తావక సు
ధాలహరీకణ మొండు నాస్థమై,
వేగగు నీ శుభాకృతిని
వేడ్క మెయిం గనుగొన్న జాలు, నా
కాగిన మానసంబునకు
గల్గు ప్రశాంతము పూతగౌతమీ!

విమలములు వినీలంబులు విస్ఫురములు
స్వాదువులు సౌఖ్యదములు శోభావహములు
పుణ్యములు నగు భవదంబుపూరములును,
సమవిశాలసుందరములై స్వర్ణకాంతి
పుంజమును వెదజల్లు నీ పులినములును,
స్ఫారనిర్నిద్ర భవదీయ సారపటిమ
నేపుగా మేదురంబుగ నెసగు చేలు

నిలువుననను బండి పసుపునిగ్గులు లసింప
దృష్టిమోహనమగు నీదు ద్వీపచయము,
అమృతము స్రవించు ఫలముల నారగించి
యెలమి పులకించి హృదయతంత్రుల గదల్చు.
కలికి పుల్గుజంటల కలకలముతోడ
ప్రసవరసమత్త భృంగాళి పాటతోడ
మొఱయు నానాలతాగుల్మ భూరుహాళి
హాళి గూర్చెడు నీ తుంగకూలములును,
అవనితలమున పాదంబు, లంబరమున
శృంగములు దాల్చి మేచకస్నిగ్ధకాంతి
పుంజముల భూదివములకు పొందు గూర్చి
ధూమరాజులు బ్రహ్మాగ్నిధూమములుగ
భయద శాంత గాంభీర్యముల్ ప్రబ్బికొనగ
రవణిలెడు యోగడంబనాడంబరమున
డంబు గుల్కు నీ శైలకదంబములును
తనివి గానని కనులతో దవిలి చూతు;
చూచి యొకవింత స్వర్గీయ సుఖము తోప
'గౌతమిని గంటి కనువిందు గాగ!' ననుచు
నృత్యమాడుదు పురివిప్పి నెమ్మివోలె.

అంబ! శ్యామల! గౌతమీ! అమల తేజ!
ప్రేక్షణోత్సవమును, అనిర్వాచ్యమైన
తావకీన పవిత్ర సౌందర్యగరిమ
మఱువనేర్తునె? వేయి జన్మాలకైన.

అనవరతంబు నాత్మ పర
మాత్మ దలంచుచు నిర్వికారతన్
దనరెడు మౌని మానస వి
ధంబున నిర్మలమై, ప్రశాంతమై,
అనయము మంథరానిలము
నై, ప్రతిబింబవిభాసితాంబరం
బునయి ప్రభాతవేళల ప్ర
మోదము గూర్తువు సాత్త్వికాకృతిన్.

పరమప్రేమరసార్ద్రమై, ముదితమై,
భావింప చింతాపరం
పరఁ గల్లోలితమౌ గృహస్థ సుమనః
పద్మంబుమాడ్కిన్ రహో

ద్ధురతాయాత సమీరసంహతి సము

ద్భూతోన్నతాభంగ శీ

కర ఫేనాంచిత మాచు బొల్తు సుభగా

కారంబునన్ సందెలన్.

పావనమూర్తి ! నీ యుదయ

భాగ్యము గాంచుట నాసికాపురం

బావిధి తీర్థరాజమయి

వాసికి నెక్కెఁ; భవత్ప్రవంతి యిం

పావహిలంగ గాలిడుట

నాంధ్రవసుంధర ధన్యయయ్యె శ్రో

భావహసస్యపాళిఁ బన

సామ్రికనత్ కదళీద్రుమాళిఁ గే

లీవనరాజమై, ప్రకృతి

శ్రీ విభవోజ్జ్వల లాస్యరంగమై.

మహితుడు సత్తపోధనుడు

మాన్యుడు గౌతమసంయమీంద్రు డి

మ్మహి గొని తెచ్చి నిల్పెనట !

మన్ననమై మునిసత్తకంబు లో

కహిత నివిష్ట చిత్తమున
        గైకొనినారట ! వేల్పుదంపతుల్
రహి నిను మెట్టినారట చి
        రమ్ముగ ! భారతు లెల్ల భక్తిమై
నహరహముం భజింతురట ! హా !
        మఱి భాగ్య మనంగ నున్న దే ?

నీ తీరమున వీచు నిర్మల వాయువుల్
        నిత్యంబు గానంబు నెరపుచుండు
నీ జలంబుల లేచు నిఖలతరంగముల్
        ప్రీతిమై నెప్డు కీర్తించుచుండు
నీ తటాంచలమున నెగడు కాంతారముల్
        సతతంబు స్మరణంబు సలుపుచుండు
నీ దరిం బొల్చు క్షోణీధరకుహరముల్
        నిరతంబును ప్రతిధ్వనించుచుండు
నీ తటీరుహపాళి నివసించు విహగముల్
        ప్రత్యహంబును పాట పాడుచుండు
నేడునుంగూడ వున్నెవుం దీవులైన
వేల్పుదంపతుల చిరపవిత్రియశుల

జానకీరామచంద్రుల సచ్చరితము
'అంతయును రామమయము' యటంచు దోప.

పావనధునీ ప్రసూనమా ! భాగ్యరాశి !
తావకామల పావన జీవనమ్ము
రామనామ సుధాలహరీమయమ్ము
కాగ కాబోలు తన్మాధురీగుణమ్ము,
తత్పవిత్రత, తన్మహాత్మ్యాతిశయము
గాంచుట యటంచు నాత్మలో నెంచుచుందు.
ఎంచి యాశలు కొనలూని సంచలింప
విడుతు నిట్టూర్పు చుక్కల వీధిజూచి.

స్వామి సన్నిధి జేర సౌభాగ్యవతిరొ!
జీవనం బప్పనంబుగ సేకరించి
మేటి శైలంబులను భీకరాటవులను
బలితపు బయళ్ల గ్రమియించి భక్తితోడ
హర్ష మాత్మ( దరంగింప నరుగుదమ్మ.
అరిగి యంతంత సంభ్రమ మగ్గలింప
సప్తబాహువల్లరులను చక్కజూచి
విశ్వభువనైకనాథు, నుద్వేలరస ద

ఖండజీవనపూర్ణసాగరుని, వరుని
బిగ్గ నాలింగన మొనర్చి, ప్రియ మెలర్చి,
ఆ యపార జీవనరాశి నట్టె చేరి
ఆ యనంత వీచికలలో ననగి పెనగి
యతుల రతులను దేలుచు నలరుదమ్మ.

నెమ్మి గదుర బ్రాహ్మోత్తర నిమిషమందు
నిదుర మేల్కాంచి పరమేశు మది దలంచి
పావన భవజ్జలంబుల భక్తి గ్రుంకి
సవితృదేవత కర్ఘ్యంబు సంతరించి
కావివల్కలములు మేన గప్పి, నిష్ఠ
మీఱ దర్భాసనంబున గూరుచుండి
కళ్ళెముల నింద్రియంబులు కట్టివైచి
మనసు కందనివానిపై మదిని నిలిపి
ఇతర బాహ్యాంతర ప్రపంచమెల్ల మరచి
రూపమే లేని జ్యోతిస్స్వరూప మరసి
క్షీరకణము పయోరాశి జేరునట్లు
ఆత్మ తత్పరమాత్మలో నైక్యమంద
నిష్కళంక భూమానంద నిభృతరాశి

దెప్పలుగ దోగియాడుచు దేవమునులు
తావక తటాశ్రమ ప్రశాంతముల పుణ్య
తపము లొనరించు దినములు తలచినంత
గుండె నీరయిపోవు నుద్దండముగను.
మారిపోయెను కాలంబు మారిపోయె;
విప్లవమె వచ్చె యుగధర్మవిధులలోన;
తరలె సంతృప్తి యాశకు తా వొనర్చి;
వగెను ప్రశాంతి క్షోభకు నెడ మొసంగి.
ఆ దినము లింక మరల రావని యెఱుగుదు;
ఐన వానినె కాంక్షించి యాస గొందు.

గంగకు ముద్దు చెల్లెలవు
గాదిలి యక్కవు కృష్ణ కంచు నిం
పొంగుచు సంస్తుతింతురి కృత
పుణ్యులు భారతభాగ్యయాత్రికుల్;
గంగయు కృష్ణయుం మఱియు
గల్గెడు పుణ్యతరంగిణుల్ భవ
న్మంగళమూర్తి రూపములు
మాటికి నిక్కవమంచు నెంచెదం.

కనుల౯ గట్టినయట్లె కాననగు నో
కల్యాణి ! నీ దివ్యమో
హానలీలాఘనవేణి వైభవము బ్ర
హ్మానందసంధాయియై
యనయం బేమెడ నే ఝరిం గనిన ; న
య్యారే! భవచ్చిత్ర వ
ర్తనముల్ మామకచిత్తనర్తనము ; లే
తన్మాత్రభావ్యంబులే !

లలితరో ! తావకోజ్జ్వల వి
లాస సుధాలహరీ ప్రచారముల్
విలసిలుగాత ! మా కెపుడు
విశ్వశుభోదయదాయకంబులై ;
అలరెడుగాత! విశ్వవిభు
నంచితమూర్తుల నీడ్యముల్ భవ
త్సలిలము లవ్యయంబులయి
శాశ్వతకాలము భద్రగాతమీ !

సుమధురగాత్రి ! నీదు ప్రియ
నూనుడ, కుఱ్ఱడ, విద్దె బుద్ధులన్
గొమరు వహింప, నైన రస
గుంభిత భావసుమంబులన్ భవ
ద్విమల సరోరుహాంఘ్రులను
వేడుక జల్లెద కూర్మితల్లి ! నీ
యమృతతరంగమాలికల
నాదట కౌగిట నాదరింపవే !

ఆనంద. వైశాఖ శు.

# నెలబాల

"ప్రకృతి పూచిన పసిడిమొగ్గా !
పదిపదిగ కను మూసె దేలా ?"

"మూతలో కనుపించు కాంతుల
ముందు మీ జగమంత చీకటి."

"కలికి చిన్నరి చిలుక పిలుకా !
చిలికెదవు చిరునగ వదేలా ?"

"లలిత రాగ వికాస మొక్కటి
జిలిజిలని గిలిగింత వెట్టును."

"పాలు కారెడి పనస ! లేజిగి
కేల గుప్పెట గూర్తు వేలా ?"

"తోడ నాడెడు చాయ కన్నెలు
వీడిపోకుండంగ బట్టెద."

•

"తీయమామిడి మొలక ! సుప్తిని
తెరలి చుంకృతి యురలనేలా ?"

"పాయకోమెడు మూర్తి మమతల
పరమ మధురామృతము లానెద."

"పాల తరగల నూగు లే నెల
బాల! జాలిని గూల నేలా !"

"పట్టి ! నిన్నిక వట్టిచీకటి
బెట్టి పోదు మటందు(?) దాదులు."

•

# బాలగీతి

(శ్రీ దేవేంద్రనాథసేనుగారి గీతికకు అనువాదము)

ఆరు నెలల బాల యామె,
పేరు గరువ మెఱుఁగ దేమొ;
కామిని లే మొగ్గ కొనను
గ్రాలుచుండు మంచు బొట్టు.

అందమైన రేయి కురుల-
సందు నుండి నవ్వుకొనుచు
ఇందురేఖ విదియనాడు
విందు సేయునట్లు లుండు.

చిన్ని వేల్పు కన్నెమిన్న
వన్నె కర్ణికాంతరమున
సన్న చూణీము త్రైమట్లు
చెన్ను గులుకుచుండు నౌర !

అక్క ప్రేమవల్లి చెల్లి
చక్కనందు చేర్చి యనును

"నిక్కము, నా కొత్త బొమ్మ
పక్కి నెంతో కూర్తువమ్మ."

"పంచదార పలుకు కన్న
పట్టు తేనె బొట్టు కన్న
పట్టి! నీవు తియ్య" ననుచు
చిట్టియన్న ముద్దు లాడు.

"ఇట్టు లింటి వార లెల్ల
బొట్టె కెనను గానలేక
అట్టె వెదకుచుండ కనులు
బిట్టు విప్పి శిరము నూచు."

# అహల్య

(శ్రీ రవీంద్రుని గీతికకు అనువాదము)

చెలఁగి రాగవికారముల్ చిత్తమందు
నురుఁగులను గ్రక్కు కల్లోలతరుణమందు
శాపహత మయి నీ జీవ మేపు దక్కి
యచ్ఛము, జడంబు, నిశ్చలంబైన యొక్క
నల్లరాయిగ నక్కటా! చల్లబడియె.
ప్రాక్తనక్షితిశాంతి లోపలకు జొచ్చి
మంటిలో శుద్ధి స్నానమ్ము గొంటి వీవు.
వాడిన దినాలు, విత్తులతోడ రాలు
పూలవలె, నవనవోదయ స్ఫురణ గాంచ
దొరగు మూఁకవి స్మృతిలోన మఱుఁగుపడితి.
గట్టిగా తల్లి తొమ్మను గాఁగిలించు
శిశువు నంగుళులట్టులు చెన్నుగులుకు
వివిధ తరులతా తృణముల వేళ్ళతోడ
నలరి నూర్యుని గిలిగింత పులకరింతు.

మంటి బొమ్మలు పోలి యా మంటియందు
మరల జేరంగబోయెడు మాపువేళ
సారె కా శ్వాసనిశ్వాస సరణి కతన
ధాత్రి బహుళమాతృత్వమ్ము తాకె నిన్ను.
వనలతావళు లచింత ప్రణయమధుర
బంధనంబుల నీదు పార్శ్వముల బెనిచె.
భ్రమర గానంబు, కిసలయ ప్రచలనంబు,
చిత్రకీట నాట్యము దేని చిన్ని యలలొ
యట్టి ప్రాణమయాంబుధి నణగియుంటి.
సరగ నెవ్వని స్పర్శ నిశ్శబ్దమందు
రాగ విద్యుల్లతాతతుల్ రగులుకొల్పు
ఆ మహామహు డెవ్వడో యతని జాడ
వినగ చెవి యొగ్గి యుగములు వేచియుంటి.
అఘమె నీ దోషవసనంబు లన్ని యొలిచె.
శాపమే నిన్ను పుణ్యసుస్నాత జేసె.
పూర్ణ జీవధారిణివౌచు పొలిచినావు.
ఆ యపారనిశీథ హిమాంబు లతివ!
తరళముగ నీదు ఱెప్పల మెఱయుచుండె.

లలిత ప్రాక్తనవర్ష శైవలము నీదు
స్నిగ్ధ కబరీభరమునకు చెలువు వెట్టు.
తావక ప్రబోధమందు చిత్రములు రెండు:
నవజనన మొండు, అతి ప్రాక్తనత యొకండు.
విరిసి విరియని పువువోలె తరుణి వగుదు;
నగములట్టు లనాదివై నెగడుచుందు.

# కో యి లా !

కోయిలా ! తీయ లేమావి కొసలనుండి
హాయిగా గ్రుమ్మరించు నీ యమృత గీతి
వీనులకు నెంతొ విందుగా విందు నెపుడు
ఎట్టి వింతవింతల చవు లుట్టిపడెడు
మేలి కళలకు నెలవొ నీ మూలమైన
ఆ మహామోహనాశ్రుతాగాధ మధుర
రాగనిర్భర గర్భరాజం బటంచు
మునిగి తేలెద నద్భుతామోద ఝరిని.

అకట ! ఈ దురంత కఠోర దుర్వికార
క్రూర దురపశ్రుతికి నెన్నడే విదూర
వాసితుడ నౌచు అవలి ప్రాభాతశాంత
మంజులోజ్జ్వల తీరకుంజమ్మునుండి
మందముగ వీచు సురభిళానందరాగ
మాలికా డోలికల నా విశీర్ణహృదయ
ముయ్యెలల నూగ నూరట నొందగలనొ ?

ఓ విహంగమ! జంగమానంద దేవ
తా! త్వదవ్యక్త మధుర గాత్రమ్ము నుండి
ఏ యఖండరసైక మంత్రమ్ము కడల
మారు మ్రోగెడునో కనలేరు గాక
యీ నరులు, ఘోరసంకుల జీవన రణ
రణిత దుస్తర బధిరులు, రమ్య ఫణితి
నీ యమృత జీవగీతి పల్లవము లెత్తి
పాడుకొనుచుందు నే జన్మ జన్మములకు
—ఇష్ట నిర్వాణ ఫలము చేపడెడు వరకు.

# గీతిక

ఇది యేకతార కాదింపులు నింపు
సప్తతంత్రుల నొప్పు సరసంపు వీణె.
ఈ వీణ వాయింప నిచ్చి జనింప
చెలువార జేసితి స్నిగ్ధభావమున.
ఈ దీనజన్మపై నెంత ప్రేముడియొ
నీ ముద్దువీణపై నెమ్మి తళ్కొత్త
తంత్రులు దిద్ది స్వతంత్రగీతముల
పాడంగ ముదల యేర్పడ నిచ్చినావు.
కాని నీ యానకు పూనిక యెట్లో
తలచినంతనె గుండె తలకును స్వామి !
వీణపై చేతులు వేసినంతటనె
వ్రేళ్ళు కొంకులు వోయి వీడును బిగువు.
మంజుల సుకుమార మహిత మీ వీణ
ఒయ్యారముగ నెట్టు లొాగి బట్టవలెనో,
తీగెల నొక్కటి తెగిపోవకుండ
తీరుగా నెట్టులు సారించ వలెనో,

ఒండొండు పోలిక యొక్కింత లేని
యీ స్వరావళి యెట్టు లెడబడకుండ
ఏకశ్రుతికి చక్క నెలయింప వలెనొ,
తానమానములు సంతన మీఱ నెఱపి
పురికొని పాటకు దొరకొను టెట్లొ
ఇంచుక యెఱుగని హీనుండ, జడుడ,
నిన్నెట్లు పాటలో నే దనియింతు?
నిన్నెట్లు పాటలో నేను మెప్పింతు?
ఓ రసికాగ్రిణీ! ఓ గానముగ్ధ!
చాలు చాలును, ఇంక చాలు నా పాట;
నలుగురిలో ఇంక నగుబాటు వలదు.
అన్నియు నెఱిగిన యఖిలేశ్వరుడవు,
సకలగాన రహస్య సారసంవేది,
వతిదయామతి నీవె యలరుచు వేగ
ఈ జంత్రమును గొని యింపులు పుట్ట
పాడంగరాదె విశ్వవిమోహనముగ
బ్రహ్మాండభాండంబు ప్రబ్బి మెండుకొని
యుగయుగాంతరముల నొక్కట మ్రోగు
అశ్రుతపూర్వమౌ ఆనందగీతి.

# మాతృపూజ

మాతృపూజా పరాయణ మహిత బుద్ధి
భావమున దుర్నివార్యమై ప్రజ్వరిల్ల
సంబరంబున నాకస్మికంబుగాఁగ
తరలినాఁడను మాతృమందిరము కొఱకు.
ఆయతక్లిష్ట తన్మార్గ మనుగమించి
దరిసితి నదెట్లొ ఆ తల్లి తావలంబు;
దరియు కొలదిని సాగు పాదములతోడ,
పదములకుమున్నె పారు భావంబుతోడ.
బారుగా తెఱచియుండెను ద్వారపాళి;
అస్త్రపాణులు లేరట నాజ్ఞవెట్ట;
అంతరాయమె లేక యభ్యంతరమున
కరిగి కాంచితి కన్నుల కరవు తీర
దివ్య శోభాకలిత మాతృ భవ్యమూర్తి.
అమల కమలమ్ము హసియించు నాననమ్ము
వాడువడియు ప్రసన్నత ప్రోడువడదు.

అందమును జిందు నవ్విశాలాక్షి యుగము
కుందువడియును తేజంబు డిందువడదు.
ఆత్మసుఖమయ జీవనాశాంకురంబు
స్వీయబాష్పాంబుధారలే సేచనముగ
నిచ్చి పెంచిన జాడ రహించుచుండె.
ప్రమదమున నశ్రుబిందువుల్ వరదవార
భక్తిభరమున చిత్తంబు పరవశముగ
నెఱగునట్టుల నెఱుగకే యెఱగినాడ
అంబ శ్రీదివ్యపాదాంబుజంబులకును.
అతులభక్తిని దీపించు నమలమతులు
కొంద ఱాదేవి చెంగట గూరుచుండి
కలశధారలతో కాళ్ళు కడుగువారు
ఆదరంబున గంధంబు నలదువారు
శ్రద్ధతో పత్రముల పూజ సలుపువారు
ఎలమి కర్పూరహారతు లిచ్చువారు
భద్రగీతికల్ సొక్కుచు పాడువారు
నగుచు పలువిధ సేవల నలరుచుండ్రి.
ఇత్తెఱంగును గన్న నా చిత్తమందు
నిండు వేడుక తరగలై నెగసి కొనగ

చేతులారంగ మాతను జేరి కొల్వ
వెదకినాడను నా సజ్జ విరులకొరకు.
కాని యక్కటా! నా మది కలత నొంద
కలిగె నాశావిభంగంబు కరములకును.
రిత్తయై యుండె నా సజ్జ; రేకొకండు
చేత బడదాయె; నంత నితాంతచింత
ఘూర్ణితాంతరమున నేల గూలబడితి.
అవల లేచియు నను తాప మగ్గలింప
తలచినాడను తప్త చిత్తమున నిట్లు:—
అకట! నావంటి వెంగలి యవని గలడె?
సమయ సముదిత సంభ్రమోత్సాహవశత
పరుగు వెట్టితి భావిభావనము లేక.
పూలు లేక పూజ యొనర్పబోవు టెట్లు?
చేతనగునన్ని పూవులు సేకరించి
మరల నరుదెంచెదనుగాక మాత గొల్వ.

# హంసలు నెమళ్ల —

"కాలవశత విలాతుల పాల బడిన
భారతుల కిట్లు సర్వభూభాగమందు
సంతతపరాభవం బేల సాగవలయు?
తప్త తైలమ్మునకు వారిధార గాగ.

"నహిరెయొ? ప్రోజ్జ్వల కమనీయ నాగరకత,
పూజ్యమో? ఊర్జిత ఖ్యాతి పూర్వచరిత,
మృగ్యమో? ఆదర్శమౌ యోగ్యశీల,
మేల? యీలీల నార్యుల డీలుపరుప.

"తెలివితేటల పరులకు దీసిపోరె!
ఒడలు వంచంగ నోరులకు నొజ్జ లౌర!
పెట్టినది పేరు! సంతృప్తి వినయములకు,
కలరె? యింతటి సాధు లీ కలియుగమున.

"అట్టి యకలుష చరితుల నక్కటకట!
క్రైస్తవుల మని పటునాగరకుల మనుచు
దంభములు గొట్టు సీమలే ధర్మ వెడలి
విశ్వమానవ సౌదర్య విధిని ద్రోచి
'యేసు' నన్యోన్యతాబోధ లీసడించి
కొంచెపరుపంగ నేలొకో క్రించు లగుచు?
నీచముగ జూడనేల బానిసలరీతి?
తలుపులు బిగింపనేల హైందవుల కిట్లు?
కరము నలయింపనేల వ్యాఘ్రుంబు లట్లు?

"ఏల యననేల? కలదుకా హేతు వొండు—
మేదుర శ్వేత కృష్ణతా భేదబుద్ధి.
నలుసె యయ్యును నీలంపు నయనములకు
మంచుమలయ ట్లభేద్యమై మలయుగాదె?

"అకట! వసుమతి యే కాంతి నలరుచుండు?
శ్రీ నభోలక్ష్మి యే లీల చెలగుచుండు?
అల సరిత్పతి యే చాయ బొలుచుచుండు?
జలదు డే యుజ్జ్వలద్యుతి వెలయుచుండు?

అదిర ! అట్టి వర్ణంబుతో నవనిమీఁద
నవతరించుటె యపరాధ మయ్యె నహహ !

"ఇస్సిరో ! మాధుర్యదేవత నేమనందు ?
మానుషమునకు తెలుపె ప్రమాణమొక్కొ ?
అదియె గౌరవైకాస్పదం బగునయొక్కొ !
అదియె సర్వసంపూర్ణమై యమరునొక్కొ ?

"ఐనచో నిక కోయిల కలరరాదు,
బకమునే కని యాహ్లాదపడగవలయు ;
శారికను జూచి కాదు ప్రశంససేయ,
బొల్లి గద్దనె పొడగాంచి పొగడవలయు !

"చెల్లరే ! కన్ను గుట్టదే నల్లకలువ ?
మహిమ గోల్పడెనే నీల మణిగణమ్ము ?
మేలి కస్తురి నత్కీర్తి గ్రాలలేదె ?
వర్ణము గణింత్రె వస్తుతత్వమ్ముగాక ?

"పూజ్యమహిముడు అల్ల త్రిమూర్తిమయుడు
మిత్రు డెంతయు మా పాలి మిత్రు డగుట

నల్లవారలమై యిట్లు చెల్లినాము,
ప్రకృతి చేతకు నెవ్వరు బాధ్యులయ్య!

"విష్ణు నవరావతారులు, విమలమణులు,
రామ కృష్ణ జినాద్యభిరామయశుల
సంతతులె మాన్యు లనుటకు చాలరైరె ?
గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించినటుల.

"అహహా ! నవనాగరకతా మహత్వగరిమ !
పూత మెఱుగుల నీక్షించు పూన్కె గాని
అంతర జ్యోతి రూపమ్ము నరయబోదు;
తడవనేర్చునె ? తుచ్ఛ స్వార్థప్రసూతి
పరగుణగణంబు కొండలై పరగుచున్న."

అని మరియు నేమొ చేదు భావనలు మిగిలి
ఆచికొన్నను రవ్వంత యాగబోక
యెడద శాంతి హరించి వేధించుచుండె
వికలగంభీరవారాశివీచు లట్లు.

కాల మొకరీతి నుండదుగాదె యెపుడు ?
త్యాజ్యమే గ్రాహ్య మగుచుండు తరుణమందు;

నిన్న వేసవి డాచిన యున్నిచేల
నెన్నగా నేడు దాల్చమే హిమము దోల?

అంబరంబున సమరమేఘంబు లలమి
కరము భీకరరవముతో నరచుచుండి
తామస శ్వేతధారుణీతలమునందు
ఘోర శోణిత ధారల గురియుచుండె

పూర్ణభాగ్యము నందిన పుణ్యరాశి
ఆంగ్లధాత్రియు ధర్మవిఖ్యాత బుద్ధి
సమద శాత్రవ గర్వ భంజన మొనర్ప
కడగి దుర్బల రాష్ట్ర రక్షణము గూర్ప
గంధగజమును దాకు సింగంబు కరణి
మేటి పగతుర గుండెలు బీటవార
భళిర! యని లోక మామోదపటిమ దెలుప
స్వర్గమున సుర లరరె! మజ్జారె! యనగ
మ్రోసి రణభేరి దిక్కులు మొఱయునటులు
ఖడ్గ మొఱనుండి ఝళిపించి కఱకు మెఱసి
ఉద్ధత పరాక్రమస్ఫూర్తి హుంకరించి
సరభసంబుగ సంగరస్థలికి నుఱికె.

చెలి బ్రిటానియ సంగరస్థలికి నుఱుక
కూర్మి నెచ్చెలి భారత పేర్మి నెంచి
రిక్త యయ్యును భక్తియే శక్తిగాఁగ
తనదు జీవధనంబులు ధారవోసె.

ఆంగ్లమాతయు భారత నతిముదమున
జేరగాదీసి మెయి మెయి జేర్చి పేర్చి
'సకియ! మన మైత్రి యింక శాశ్వతము సుమ్మ!'
అని యనూనరాగము జిల్కు యనునయించె.

భరతవీరులు నిర్మలభక్తి మెఱసి
కడిమిమై నాంగ్లరాష్ట్ర రక్షణము పొంటె
విశ్వమోక్ష యాగమున ఋత్విక్కులగుచు
ఏడజూచిన తామెయై యెసగుచుండి
సమద శాత్రవానీకముల్ చక్కు దునిమి
ధీరులై జీవరక్తమ్ము ధారవోసి
పూతమా నస్థికల శ్వేతభూమి రాల్చి
దశదిశల యశశ్చంద్రికల్ విసరినారు.

సమాసె పూర్వ విభేదముల్; చక్కడంగె
నెల్ల యీసులు; రోసముల్ చల్లబడియె;
'ప్రాచి ప్రాచె, ప్రతీచి ప్రతీచె' యనెడు
వాక్య వర్ణంబులెల్ల దబ్బరలు గాగ,
'శాంతి ర' స్తని సేసలు చల్ల బుధులు
పరమపిత హర్షమున మీాఁటి శిరము నూఁప,
హంసలు నెమళ్లు మైత్రితో నాడదొడగె.

౧౯౧౫.

## శాంతి

తల్లి భూదేవి తనయుల దైన్యగతికి
తన యపార కృపామతి తలకి యులికి
జాలి దిగగూలి తాలిమి మాలి సోలి
రక్షకై సర్వ భువనైకరక్షు జేరి
విశ్వవంద్యంబు లవ్విభు విమలపాద
కమలములు వేడి కన్నీట గలయ గడిగి
ఆర్తరవమున గద్గద యులమికొనగ
వినయ మెసలార నిట్లని విన్నవించె.
"దుడుకులై పాడిమాలి నాకొడుకు లకట!
మధురసౌదర్యరస మాన మాని దేవ!
కరము హేయము, దుర్విపత్కరము నైన
దారుణ ద్వేషవిషమును ద్రావి త్రావి
కష్టదుష్ట ప్రలోభ విభ్రష్టులగుచు
మైమఱచి మానుషంబను మాట మఱచి
ఓదయాపూర! కూర్మి నీ వొసగినట్టి

సకల పురుషార్థ సాధనచణములైన
యొండొరుల దివ్యదేహముల్ చెండికొనుచు
ప్రాణశోణిత మేరుగా బరపికొనుచు
ప్రజ్వరిల జేసి శోకకరాళవహ్ని
గ్రమ్ముచున్నారు మిడుతలమాడ్కి గాగ.
నిత్య సౌభాగ్య సంపద నేడు దక్కె
నెత్తుటిచే నస్థికలచేత నెనడుచేత
పూర్ణమై యుండె నాయిల్లు భువననేత!
ప్రోడువడె పండ్ల తోటలు; బీడువడియె
పంటచేలెల్ల; నాశమే పైరుకొనియె.
నిర్మలంబగు నా వాయునిచయమెల్ల
దళిత పితృశోకరావ సంకులిత మయ్యె;
ఉడుగళయు పొర్లు తరుణుల యూర్పు సెగల
నుడికి రోదసి కొల్మియ ట్లడరుచుండె.
ఎటుల సహింయింతు నీదుఃఖజటిల భరము?
దీనమందార! యో దేవదేవ! వరద!
కరుణమై శాంతి దయచేసి కావగదవె!"

*　　　*　　　*

పలుకు పలుకున ననుకంప జిలుకరించు
ధారుణీదేవి మొఱ మది దూరి కఱచ

పరమపిత కన్గొనల బాష్పపటల మూరి
ప్రజల దుర్దశకై బిట్టు పరితపించి
దేవి కూఅట బోధించి దిగులు మాన్చి
'శాంతి' క్రేవను దిలకించి సాదరమున
పలికె నిట్టులు పటుకృపావశ్యు డగుచు.
"వింటివే? మానవుల దుఃఖవిధము, శాంతి!
ఓర్వజాలదు భూదేవి యూర్మిరాశి;
వినగనేరవు నా చెవుల్ విస్తరముగ;
అరుగుమా వేగ ధాత్రికి; స్థిరతరముగ
మాన్పుమా వైరవహ్నితో మానవార్తి."
అనిన విని 'శాంతి' శాంతముఖాబ్జమందు
వినయ భయ సంభ్రమంబులు వెల్లివిరియ
చలువచేతుల నంజలి సంఘటించి
శారికాలాపముల నిట్లు కేరి పలికె.
"శిరముననను దాల్చి నీ యాన నేతు నెపుడు;
ఓడు నానోరు నీ కెదురాడ దేవ!
ఐన నొక విన్నపమొనర్తు నవధరింపు.
నీ వెఱుంగని దెయ్యది? నిఖలవేది!
మానవులు మత్తులై కొల్వమాని మనల

దేవరకు నాకు పరమవిద్వేషి యైన
పరమరాక్షసు 'లోభునే' పట్టి నమ్మి,
భక్తిమై ప్రాణ ధన బుద్ధి బలములెల్ల
గానుకఁబెట్టుచు, తృప్తికై ఘనబలు లిడి,
నిత్య మాతని కృప వేచి నిలుచుచుంద్రు.
మరగి తమ చేయు కట్టిడి మతకములకు
మెఱుఁగుగ నటింత్రు మనయెడ మేటిభక్తి.
ఇట్టి కుహనాచరులపట్ల కెట్లు పోదు?
ఇట్టి ద్రోహినరులచెంత నెట్టు లుందు?
ఈశ! నావిన్నపము కృప నెంచుమయ్య;
వంత కుడుతురు నరులని వగవనేల?
కుడుచునప్పుడె కా నేర్చికొనుట యెపుడు?
అడుగక వరమ్ము దయసేయు టగునె మేలు?
అతరుణఫలంబు సార్థక మగున యొక్కొ?
మానవులు ప్రాజ్ఞులై యెప్డు 'మాయ' విడిచి
దుష్ట 'లోభుని' సేవకు దొలఁగువారొ,
ప్రభువ! నీధర్మపథమున భక్తి గలిగి
తద్దయును గూర్మి నన్నెప్డు తలచువారొ
ఆ క్షణంబున నీ యాన ననుసరింతు,
దయను న న్నిప్డు పుడమికి తఱుమవలదు.

౧౯౧౬

# శాంతి

శాంతి ! శాంతి ! యటంచు నేమో
రంతు లెల్లెడ చెవుల జొచ్చెడు !
సంతసింతునొ కాక— మఱి యీ
చంద మెఱుగనుగా.

విశ్వశాంతి యటంట ! ఓహో !
విశ్వమానవ మోక్షమట ! మఱి
విశ్వసోదర భావమట ! ఆ
విశ్వ మదియేమో ?

శ్వేతభూమియె విశ్వమంచును
శ్వేతముఖులే మనుజులంచును
శ్వేతమే సర్వం బనుచు భళి !
చెలగి చాటుదురో ?

కాలజాతుల కుత్తుకల్పై
కాలు మోపియు నేల మట్టుచు
జాలమైనను తీయనొల్లని
జాతులే నొక్కె ? శాంతికి
దూత లియ్యెడల !

రెండుముప్పదికోట్ల తనువులు
ముండ్ల గొలుసుల గాయపడి యు-
ద్దండ వేదన గొలుప తల్లికి
ఉండునే శాంతి ?

రెండుముప్పదికోట్ల కడుపులు
దండియాకలి మండుచుండగ
బెండువడి నిట్టూర్చు తల్లికి
ఉండునే శాంతి ?

రెండు ముప్పదికోట్ల నోరులు
చండవృత్తి బిగించి కట్టియు
చెండ నాడగ విశ్వజననికి
ఉండునే శాంతి ?

ఒక్క యంగము బట్టి తల్లిని
ముక్కముక్కగ తరుగుచును వే
రొక్క యంగ మలంకరించిన
చిక్కునే శాంతి ?

చాలుచాల్ ! ఈ యాగడమ్ములు
మేలుమేల్ ! దయ్యములె నవ్వెదు !
ఏల యీ వంచనలు ? దేవుం
డెదుట లేడొక్కొ ?

లేదు లేదు ప్రశాంతి భువిలో !
లేదు లేదు ప్రశాంతి దివిలో !
ఆధి నొందుచు దాసు డొక్కం
డడలు నన్నాళ్ళు.

లెండు లెండో శాంతి పుత్రులు !
రండు ముందుకు ధర్మయోధులు !
పొందు యాగప్రపూర్తికై ! చే
కొందు మోక్షంబున్.

వలదు వలవదు బలుఫిరంగులు,
తోలగ ద్రోయుడు కలుకుటమ్ముులు,
నిలువుడీ ధీరతయె తోడుగుగ
కలహారంగమునన్.

అంటుకొన్న మహాచితాగ్నిని
ఆరకుండగ బట్టి నిలువుడు !
అంటుపోవ రగుల్చు డందుల
ఆత్మకణ మొందున్.

అసమ పావన శుభచరిత్రులు
ఋషులు చెప్పిన సామిధేనులు
కొసరి కొసరి పఠించి జ్వాలలు
దెసలు ముట్టంగన్.

వ్రేల్చుడీ ! హోమమున లోభము,
కాల్చుడీ ! భూకలుష మెల్లను,
వేల్చుడీ ! స్వార్థంబు, నెమ్మది
దాల్చి ప్రేమంబున్.

హవ్యజాలపు ఆర్ద్ర ధూమము
దివ్యగంధము కడల జల్లగ
నవ్యకాంతుల పూతలోకము
భవ్యముగ వెలుగన్,

మొక్కలులు రక్కసుల గుండెలు
గ్రక్కదలి కడు స్రుక్కు చెందగ
పిక్కటిల్లెడు దేవగానము
దిక్కు లలరింపన్,

ఒక్క తేజోమూర్తి, చలువల
యిక్క హోమమునుండి వెలువడి
గ్రక్కునను తారాపథంబున
చుక్కవలె ప్రాకున్.

ఒక్క ప్రక్కను లక్ష్మి, మఱి వే
రొక్క ప్రక్కను వాణి కొల్వగ
క్రిక్కిరిసి ఋషిగణము స్వస్తులు
కీర్తనలు సేయన్.

జయము జయమిదె! లోక జననీ!
జయము జయమిదె! భువనపాలిని!
జయ! విజయ! యని జగములెల్లను
జయలు వెట్టంగా,

ఆర్తజనముల యార్తు లురలగ
ధూర్తదాస్యపు చిన్నె లెడలగ
శశ్వదానందమున మీఱుచు
విశ్వ ముప్పొంగా,

సర్వమంగళ కనకసింహా
సనమునను గైసేయు, నంతట
ఉర్వియెల్ల నఖర్వ శాంతిని
ఓలలాడునుగా!

౧౯౧౭.

# సీతువు

కడచనె నీదు కాల; మిక
        కాని దినంబులు వచ్చి ముట్టె; నీ
యెడద గలంచి కాల్చెడు న
        హీన భయార్తులు; సంభ్రమంబు వు
ట్టెడు; కడు శంక దొర్కొనె; క
        డింది వడంకు జనించె; నింక నే
వడువున నిల్వ నేర్తు విట?
        వైళమ నీ యెడ కేగు సీతువా!

ముగ్ధ మోహన గీతముల దిశల్ గదలించు
        కలకంఠములకు వాకట్టు కట్టి
మధుర మంజుల పరీమలయుక్తి సొలయించు
        మలయానిలునకు కోఅలను గూర్చి
శ్యామల కోమలచ్ఛవికీర్ణ తరులతా
        కుంజంబులకు నాకు గొనబు దుల్చి,

కన్నెపూదేనియ కాని యొం డొల్లని
　　మధుపపుత్రిల నోట మన్నుగొట్టి
పసిడిపస లీను సస్యసంపదల మాడ్చి
కడకు పాణిరసంబె ముష్కరత బీల్చి
ప్రకృతి హారురన రేల బాష్పములు గురియ
మోడుగా మాడ్చితివికాదె కూర శిశిర!

కల పొలయల్క సందుగొని
　　కావరవృత్తి కుమార దంపతీ
నిలయములందు జొచ్చి పురు
　　ణింపగరాని వ్యథల్ ఘటింపగా
దలచితి; వైన నీవలన
　　తథ్యము, అద్వయ సౌఖ్య మబ్బె; నీ
కలిమికె చేటువచ్చె; నిక
　　కాగల కార్యవిధాన మెంచుమా.

కనుమదె తూర్పుచాయను వి
　　కస్వరకాంతులు తోరగించె; భో
రన జయగీతికల్ సెలగె;
　　నల్లన గంధవహుండు వీచె; శో

భన మహనీయమూర్తి, కరు
బంత విభావిత దివ్యకీర్తి, చా
రునటవసంతమూర్తి యదె
రూఢిగ చైత్రిక మెక్కి వచ్చెడున్.

అవునిక నాలసించిన న
పాయము; నీ వలిసీమ చేరుచే
మివుల నుపాయ; మైన నొక
మేలు వచించెద: నిత్యనవ్యమా
ధవునకె కాని యియ్యెడల
తామసవృత్తి మలీమసుండు సీ
తువునకు స్థానమింతయు సు
దుర్లభమంచు నెఱింగి పొమ్మికన్.

# హొలి పాట

హొలి హొలీ ! బలిబలీ !
కల కలా రాగదే
కలికి బంగరు తల్లి !
కనుల పాల్గారుతూ
మా స్వరాజ్య దేవతా !
          మా తల్లి !
మా భరత రాజ్యలక్ష్మి !

హిందూ ముసల్మాను
లందఱము వచ్చాము,
బౌద్ధ సీఖులు ఏక
భావులై వచ్చాము,
పారసీ క్రైస్తవులు
పరుగున వచ్చాము,
బ్రాహ్మణ పంచముల్
బలిసి కలిసొచ్చాము,

మా భేద భావములు
మంట కలిపేశాము,
మమ్ము మన్నింపవమ్మా.
మా తల్లి!
మ మ్మాదరింపవమ్మా.
పొలిపొలీ ...

ఋగ్యజు స్సామాలు
గ్రంథ త్రిపిటకాలు
జెందవెస్త ఖొరాను
జేహోవ కీర్తనల్
పాడుతూ ఆడుతూ
వేడుకల్ మీఱుతూ
నీ గుడికి చేరినామే,
మా తల్లి!
నీ నీడ నిల్చినామే.
పొలిపొలీ ...

రామ భీమ కిరీటి
రణప్రతాప శివాజి

కృష్ణరాయ మహాంధ్ర
విష్ణు యుగంధరుల్—
వీర విక్రమ కళా
విశ్రుతోదారుల
వేడి నెత్తురు మాది,
వాడి కత్తులు మావి,
వీరభారతుల మమ్మా,
మా తల్లి!
కోరి జాతర వస్తిమి.
షాలి షాలీ ...

నవజీవన ప్రభల్
దివినుండి పర్వగా,
నవయుగోదయ లక్ష్మి
నాట్యముల్ సలుపగా,
నవరాగ మాధురుల్
నమలి గుండెలు లాగ
పరుగు పరుగున నీదు
అరుగు దరి కొచ్చాము,

తరుణారుణోద్ధుర
స్ఫురణోగ్ర తేజులము,
తరుణ భారతుల మమ్మా!
మా తల్లి!
కరుణ మా బలిని గొమ్మా
పాలి పాలీ ...

అతుల శుభచరితలై
సతుల సిగపూవులై
చితుల నెక్కిన ఆర్య
సతుల సంతతులము,
పతిత భారత ఘోర
పరిభవానల మార్ప
వ్రతులము, నవ్య భా
రత వీరసతులము,
వితత సర్వార్పణో
ద్యత మతిని నీదరికి
కుతుకమున వచ్చినామే,
మా తల్లి!

అతికృపను మమ్ము గనవే.
పాలి పాలీ ...

పాల బుగ్గల నాడె
వాలాయమును సమిత్
కేలీ వినోదులై
వాలి యరిశిరములను
గోలీలుగా జేసి
హేల చూపిన మహో
శాలి వాహను భేటి
బాల చంద్రుని ధాటి
మా కండ నెత్తురుల
మరల మేల్కాంచంగ
పిలుకొన వచ్చినామే
మా తల్లి !
బాల భారతుల మేమే.
పాలి పాలీ ...

చిరదాస్య బంధ బం
ధుర వేదనల నలగి,

కలగి స్రుక్కిన నీదు
గారాబు బిడ్డలము,
కడిది ముప్పది కోట్లు
పొడవు చెడియున్నాము,
కాలు సేతులు నోళ్లు
కట్టువడి యున్నాము,
దీనులము, నీ కృపా
ధీనులము, నీ కిదే
కానుకగ మా తను
ప్రాణముల్ తెచ్చాము;
వేళ యిక రాగదమ్మా,
మా తల్లి!
వేగ బలి గొనగదమ్మా.
పాలి పాలీ...

మా మనోరాజ్య వి
భ్రాజ న్మహారాజ్ఞి!
మా ముక్తిరూపిణీ!
మా శక్తిదాయినీ!

మా యిష్టవర్షిణీ!
మా కష్ట వారిణీ!
నీ భక్తవరులము
నీ దాసజనులము
నీ గద్దెసన్నిధికి
నేడు బలి వచ్చాము
రాగదె స్వారాజ్యలక్ష్మి!
మాతల్లి !
రావె మా స్వర్గలక్ష్మి!
పొలిపొలీ ...

మమ్ము కని పెంచేటి
మా యమ్మ దుర్గమ్మ!
మమ్ము కాపాడేటి
మా మహా లక్ష్మమ్మ !
మమ్ము మాయించేటి
మా మహంకాళమ్మ !
మా కంటి నీడలై,
మా యింటి పడుచులై,

మా యిల వేల్పులై,
మా యూరి కాపులై,
మ మ్మెపుడు బ్రోచేటి
మహిమ కల ముక్కోటి
మా దేవతల్లార!
మా తల్లులారా!
రా రమ్మ వేగమే,
రా రమ్మ పొలికి!
రా రమ్మ వేగమే,
రా రమ్మ బలికి.

పొలి పొలీ . . .

మా కమ్మ నూర్పు తె
మ్మెరల ధూపమ్ములు,
మా వాడి చూపు మెఱు
పుల గండజోతులు,
మా పొంగు నెత్తురుల
మధుర పానకములు
అందాలతో వచ్చి
అందుకోరమ్మా!

మా గుండియలు చదిపి
మా మర్మములు కదిపి
మా లోభములు చిదిపి
మా రాగముల మెదిపి
మా జీవ కుంభాల
మటి మటీ నింపుకొని
భూరి సంతృప్తిగా
ఆరగించండీ!

మా ప్రేమములు కంఠ
మాలికలుగా దాల్చి,
మా కామ గంధముల్
మై నిండ నలదికొని,
మీా కోటి కంఠాలు
మేఘవీథిని మ్రోయ
ప్రళయాంక గీతాలు
పాడగదరమ్మా!

చెట్టపట్టాల్ గట్టి
అట్టహాసాలతో
గట్టిగా ఉప్పరము
దట్టి, తారలు చెదర
గొట్టి, భువి యదరంగ
నట్టువలు తొక్కి మీ
ప్రళయ తాండవ కేళి
ప్రకటింపరమ్మా !
హాలిహాలీ ...

౧౯౩౦
సెంట్రల్ జైలు,
రాయ వేలూరు.

# స్వేచ్ఛాగానము

నా తనువు కర్కశోపల నద్ధ కుడ్య
రాజి పరివృతాయఃపంజరాంతరమున
శృంఖలాబద్ధమై కృశియించుచుండు ;
　　నా మది విహాయసపథమ్ము నధిగమించి
　　దిక్కగమి దాటి యశ్రుతద్వీపములను
　　నిత్య స్వేచ్ఛావిహారియై నెగడుచుండు.
నా కనులు తారకాకిరణప్రసార
మును చొరగరాని గాఢతమోవృతములు ;
　　కాని మాహాత్మ్య దివ్యప్రకాశ పుంజ
　　నవనవోన్మేషమై వెల్గు నా హృదయము.
నేను యమభటులం బోని నీచదండ
నాధికారి తిరస్కరణాభిఘాత
ముల కనుక్షణమును సిర మొగ్గవలయు ;
　　ఐన విశ్వజనని కరుణార్ద్ర మధుర
　　లోల దృఙ్మాలికాజాలలాలితుండ.

కొలిచి దినమును నా కిడు కూడు కుక్క-
లైన ముట్టని హేయపదార్థ చయము;
నా రసన చవిచూచెడునది నితాంత
పదప్రసాతీత మధుర రసాయనమ్ము.
నా శిరము క్రూర నిశిత కంటక కిరీట
పరినిపీడిత;
మైన శ్రీ భరత ధాత్రి
తరుణ చరణాబ్జ సంస్పర్శ ధన్యతమము.
నా యొడలు డస్సి క్రుస్సి నానాట శల్య
శేషమైనను లోన విశిష్ట విమల
దివ్యకాంతి మయామర దేహ మొండు
దినదిన ప్రవర్ధమానమై తేజరిల్లు.

౧౯౩౧
రాయవేలూరు జైలు

# మహాత్మ!

అపుడు నీ సత్యతపము మహాద్భుతముగ
పూచి ఫలియించె నొక్క యపూర్వఫలము;
భారతులె కాదు, ఆశాంత ప్రజలు హర్ష
మేచి నిను కిరీటించి కీర్తించినారు.

ఇపుడు నీ సత్యదీక్షాపరీక్ష సురలె
నీ పరాజిత లజ్జిత నిందిత మగు
శిలువ గొట్టిన నెత్తుటి శిరముపైని
సేసలను జల్లి మ్రొక్కి యాశీర్వదింత్రు.

ఏది జయము? పరాజయ మేది నీకు?
మేదిని గలంచు పశుబలోన్మాద మెదిరి
దేవునకు ధర్మమునకును దేశమునకు
ఆత్మబలి యిచ్చు పూతసత్యావహామునం.

౨౮.౫.౩౪

# శిల్పి

యుగ యుగమ్ములుగా నెంతో యోజ నేసి
నరుని నిర్మించినాడు విన్ననువు మెఱయ,
మృణ్మయము నుండి రేఖలు మేలుకొలిపి
బ్రహ్మ తన ప్రతిరూపమ్ము పరిణతముగ.

నరుడు క్రమ్మఱ తన మహోన్నత గభీర
పూర్ణ సత్యమ్ము నీక్షించు పూన్కితోడ
ఏండ్లు పూండ్లునుగా తపియించి భూరి
తేజ మానందబ్రహ్మమూర్తిని రచించె.

తన మనికి సఫలం బౌట ధన్యుడ నని
తనివి నని లోనె బ్రహ్మ సంతసము మీఱె.
తన యనల్ప సుశిల్ప సౌందర్య మరసి
ముగ్ధుడై దివ్య విస్మృతి మునిగె నరుడు.

౧౯౩౫

# ప్రజాగీతం

పెరుగుతోంది
పెరుగుతోంది
పరుగులతో
నర సంతతి.

తరుగుతోంది
తరుగుతోంది
దరులు లేని
సిరిసంపద.

విరుగుతోంది
విరుగుతోంది
విరు గెఱుగని
వీర్య శక్తి.

ముట్టుకుంది
ముట్టుకుంది
గుప్పు గుప్పు
గొప్ప ముప్పు !

పొడు చీకు
గుడిసెల్లో
ఊడు తోలు
బొమికలు!

మూడు కడుపు
మడతల్లో
బూడిద—
కాదు బుగ్గి !

ఎండవాన
గండు చలికి
ఒండె చింపి
తుండుగా !

దండిబాధ
పండియున్న
అండలేని
బ్రతుకె పో !

—అయ్యో !

గోల గోల !
ఏల మీకు
జాలి లేక
పోయెగా ?

చాలు నింక
కాల శక్తి
జ్వాల ఘోష
వినరో ?

ప్రాణి హింస
నాణె మానొ,
జ్ఞాన బుద్ధి
గనరో ?

దేవుడంటు,

దైవమంటు,

ధర్మ మంటు

కర్మ మంటు,

తెలివి వెలుగు

తొలగనీక

మనిషి ఘనత

మండనీక

అట్టె యిట్టె

చూడ బోక

ఆస్తిక్యప్ర

శస్తంగా

—సత్య మేవ

జయతు !

సత్యమేవ

జీవతు !

కట్టడులను

కాల్చివేసి,

రట్టడులకు

రంకె వేసి,

లోకము సౌ

భాగ్యము, న

ష్ట్రోన్నత

శుభము నెంచి

వేకువతో

తేకువతో

మేకొని మిత

ధర్మ మూని

చేకొనండి

సత్సంతతి;

మేక మూక

మీకు కాదు !

నాకమునకు
నకలుగ భూ
లోకమ్మును
దిద్దుకోండి!

గులక రాళ్లు
కోటిమైన
వెలముత్తెం
కొలది యౌనె?

మితధర్మమె హితధర్మము;
మితవృత్తే పూతచరిత;
మితభోగంబే
అతుల స్వర్గసుఖము; స
ద్గతి మితమున గాక వేరె
మతమున కలదే?

లేదు హాని
లేశ మిందు;
లేదు దుఃఖ
భీతిలవం;

ఆత్మసుఖం,
సంఘ శుభం,
అన్ని యిందె
ఉన్నవన్న!

వజ్రకల్ప
మీ సూత్రం
వడి గొనండి!
జడియకండి!

అబ్బురముగ
అవనియందె
అమరసుఖము
లందుకోండి.

పట్టు మీఱ
ఇట్టి నియతి
పట్టండో
ప్రజలారా!

పట్టుకుంటె

భరతభూమి

మట్టి మట్టి !

—ఒట్టు ఒట్టు !!

౧౯౩౫